# ఈ చిత్రం గురించి ...

సృష్టిలో ఏ ప్రాణి దొంగకాదు. ఈ సమాజంలో అందరూ "మనుషులు చేసిన దొంగలే"

పూచే ప్రతి పుష్పం తాను వికసించాలని పదుగురికీ పరిమళాలు వెదజల్లాలని ఎలా ఆశిస్తుందో అలాగే సృష్టిలో ప్రతి మనిషీ తాను నీతిగా బ్రతకాలనీ తన వారిని ప్రేమించాలనీ ఆశిస్తారు. కాని విధివంచితులై కొందరూ, కన్నీటికి బలై కొందరూ ఆశలకు ఆశయాలకూ దూరంగా మరికొందరూ మిగిలిపోతారు. ఈ ఇతి వృత్తం ఆధారంగా నిర్మించబడిన చిత్రమే శ్రీ పద్మావతి పిక్చర్స్ వారి "మనుషులు చేసిన దొంగలు"

సురేష్‌కుమార్, భవానీప్రసాద్ అన్నదమ్ములు. తండ్రి ప్రేమకు నోచుకోని ఆ పసికందులు తల్లిదీక్షే తమ మనసులను తల్లి ఒడిలో ఓదార్చుకుంటూంటే పదుగురి కన్నీటితో తన కడుపు నింపుకునే "విధి" వారిపై అకారణంగా ఆగ్రహించింది. ఫలితం తల్లిని పోగొట్టుకున్నారు. అన్నదమ్ములు ఇద్దరూ ఒకరికొకరు దూరమయ్యారు. అన్నం, అన్నం ఎరుగని వయస్సుతో కన్నీటికి బలియైన వయస్సుతో నిలువ నీడలేక, బ్రతికే మార్గం తోచక విలపిస్తున్న ప్రసాద్ ఒకనాడు దాదా కంట పడ్డాడు. మరునాటినుండే "జేబుశ్రీ"గా ప్రసాద్ మారాడు. జానెడు పొట్ట నింపుకోలేక ఆకలేసి అన్నమడిగితే ఉన్నవారియింట కొసలాడుకున్నాకే ఇచ్చే కసిపప్పులదరకు కూడా ఇవ్వని ఈ సమాజంపై కసిపూని కుమార్ ఒక పెద్ద స్మగ్లర్‌గా మారాడ

విధి వంచితులైన అన్నదమ్ములిద్దరూ తాము చిక్కుకున్న విషవలయం నుండి ఎలా బయటపడి కలుసుకున్నదీ, ఆసక్తికరమైన విధానంతో చిత్రీకరించబడిన ఈ చిత్రంలో చూడండి.

చరణం 1 మనసారా నమ్మానురా
నన్నమ్మి పోయావురా
నీ తోడు కోరానురా
నీ నీడ ని వానురా
తోడు నీడ జాడకూడా
లేకుండ చేశావురా ||మనసెందుకో||

చరణం 2 తొలివలపు విలువేమిటో
నీ మనసు ఏ మెరుగురా
కన్నీటి కథ ఏమిటో
వినదానికే తెలుసురా
కన్నె మనసు గాయపరచి జ్వాలరేపావేలా ||మనసెందుకో||

పాట నెం. 3 రచన : రాజశ్రీ పాడినది : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం

తెలుసా – నా మదిలో ఉన్నావనీ
తెలుసు – నీ మనసే నాదేనని
నీ తలపే – నా కలిమీ
దోపిడి చేస్తానని

తీయని తేనెల గనులూ – నీ కనులు
తీరని వలపుల సిరులూ – నీ కురులు
నీలోని అందాలు
అన్నీ నావేనని
ఆ .... ....

ఎలావుంది మనస్సేదు
యమ స్పీడు....

తొలకరి వూహలుసాగే – చెలరేగే
గడసరి వయసే ఉరికే – నీకోరకే
వెచ్చని నీ ఒడిలోనా
వేడుక తీరాలనీ
ఊ .... ....

ఎలావుంది మనస్సేదు ?
అసలు తెగందే

కమ్మని కలలా నీవు
వచ్చావు
తెరగని కథలా నాలో
నిలిచావు
కమ్మని కలలా నీవు వచ్చావు
తెరగని కథలా నాలో నిలిచావు
వలచాను - నిలిచాను
నిన్నే గెలిచాను
ఆ .... ....

ఎలావుంది మనపల్లెదు
సుమస్వదు ............

పాట నెం. 4   రచన : సి. నారాయణరెడ్డి   పాడినవారు . సుశీల, రామకృష్ణ

ఆమె : నీవే నీవే ఓ ప్రియా
నా మది పలికిన మోహన గీతివి నీవే సుమా

అతడు : నేనేలే ప్రియా

ఆమె : నీవేలే సుమా

ఆమె : అలలై ఊగే ఈ పూలలో
కలలే మూగే ఈ వేళలో
నను పిలిచే కోరిక నీవే

అతడు : పగలూ రేయీ నా ధ్యానమై
ఏనాడైనా నా దానవై
నను కలచే రాధిక నీవే ॥నీవే॥

అతడు : పావన జీవన తీరాలలో
ఊహల కోయిల రాగాలలో
నను కొలిచే దేవివి నీవే

ఆమె : అనురాగానికి వేదానివై
నా హృదయానికి నా దానివై
నను వలచే దైవము నీవే

పాట నెం. ౬

రచన : ఆరుద్ర

పాడినది : సుశీల, బాలసుబ్రహ్మణ్యం

పల్లవి : ఆనందం అబ్బాయి ఐతే
అనురాగం అమ్మాయి ఐతే
ఎడబాటు ఉండదు ఏనాటికి
ఇదినిజము ముమ్మాటికి

అతడు : నేను దొంగనైతే – నువ్వు
నన్నే దోచినావు

ఆమె : దోచి దాచుకున్నా – నేను
నీకై వేచివున్నా

అతడు : నీ కోసమే నేను జీవించుతా

ఆమె : నీ గుండెలోనే నిదురించుతా ॥ఆనందం॥

అతడు : నీవే రాధవైతే – ఇక
నాదే రాసలీల

ఆమె : నేనే వేణువైతే – ఇక
నీవే రాగమాల

అతడు : అందాలసీమ బృందావనం

ఆమె : ఆ సీమలోనే మనజీవితం ॥ఆనందం॥



